# <u>అశౌచ నిర్ణయము (దాతే పంచాంగం 2015-16 ప్రకారం)</u>

## అశౌచ నిర్ణయంలో కొన్ని ముఖ్య పదాల వివరణ

ఉపనీతుడు అంటే ఉపనయనము (వడుగు) జరిగిన వాడు.అనుపనీతుడు అంటే ఉపనయనము (వడుగు)  కాని వాడు.మాతామహుడు అంటే తల్లితండ్రి.మాతామహి అంటే తల్లితల్లి.దౌహిత్రుడు అంటే కూతురి కొడుకు.దౌహిత్రి అంటే కూతురి కూతురు.పక్షిణి అంటే ఒకటిన్నర రోజు .ఇది రెండు విధాలు. రెండు పగలులు ఒక రాత్రి లేదా ఒక పగలు రెండు రాత్రులు.పగలు అంటే సూర్యోదయం నుండి సూర్యాస్తమయం వరకు.రాత్రి అంటే సూర్యాస్తమయం నుండి మరుసటి రోజు సూర్యోదయం వరకు

పగలు మరణ వార్త తెలిస్తే, ఆ రోజు పగలు, ఆ రోజు రాత్రి మరియు మరుసటి రోజు పగలు అంటే 2 పగలులు మరియు ఒక రాత్రి మొత్తం 3 భాగాలు కలిసి పక్షిణి అనబడును.రాత్రి మరణ వార్త తెలిస్తే, ఆ రోజు రాత్రి, మరుసటి రోజు పగలు మరియు రాత్రి అంటే 2 రాత్రులు మరియు ఒక పగలు మొత్తం 3 భాగాలు కలిసి పక్షిణి అనబడును.

సజ్యోతి అంటే అర్ధ రోజు అంటే సాయంకాలం నక్షత్ర దర్శనం వరకు

అతిక్రాంతాశౌచము అంటే అశౌచదిన పరిమితి తరువాత మరణ వార్త తెలిసినా కూడా పాటించే అశౌచము.

స్వగృహములో అంటే అశౌచము పాటించే వ్యక్తి ఇంటిలో.

సపిండ సంబంధ వివరము

ఏడు పిడుల (సప్త పురుష) పర్యంతము సపిండులు అంటారు. ఉదాహరణకు :- తల్లి, తండ్రి, అన్న, తమ్ముడు, కొడుకు, మనవడు, తాత, ముత్తవ, ముత్తాత, అతడి భార్య ఇలా దాయాదులు, అన్నదమ్ముల పిల్లలు, వీరందరు సపిండులు. వివాహిత స్త్రీకి మూల వంశమునుండి సంబంధము తొలగి పోవడం వల్ల స్త్రీ సపిండురాలు కాదు.

రజస్వల దోషము:- స్త్రీలకు రజస్వల ప్రతి మాసం 27 లేదా 28 రోజులకొకసారి వస్తుంది. జ్వరం వల్ల కానీ ఇతర కారణాలవల్ల కానీ రజస్వల త్వరగా రావచ్చును. రజస్వల వచ్చిన రోజునుండి 17 రోజులలో తిరిగి రజస్వల వస్తే స్నాన శుద్ధి. 18 వ రోజు రజస్వల వస్తే,1 రోజు పాటించాలి, 19 వ రోజు వస్తే 2 రోజులు పాటించాలి, 20 వ రోజు నుండి ఎప్పుడైనా రజస్వల వచ్చినా 3 రోజులు రజోదోషం పాటించాలి.

ప్రథమ దిన నిర్ణయము:- రాత్రి (సుమారుగా 01:30 a.m. తరువాత) జననం, మరణం లేదా

రజోదోషం ఈ విషయాలలో, రాత్రి ప్రమాణాన్ని మూడు భాగాలుగా భాగించగా మొదటి రెండు భాగాలలో జననం, మరణం లేదా రజోదోషం వస్తే ఆ రోజునే ప్రథమ దినంగా లెక్కించాలి. ఒకవేళ అది మూడవ భాగంలో వస్తే, మరుసటి దినాన్ని ప్రథమ దినంగా లెక్కించాలి.

గర్భస్రావం జరిగితే:- మొదటి మూడు నెలలలో జరిగితే మూడు రోజులు, 4 వ నెలలో జరిగితే 4 రోజులు కేవలం తల్లికే జననాశౌచము. తండ్రి మరియు అందరు సపిండులకు స్నాన శుద్ధి.

గర్భ పాతం జరిగితే :- 5 వ నెలలో జరిగితే 5 రోజులు, 6 వ నెలలో జరిగితే 6 రోజులు కేవలం తల్లికి మాత్రం జననాశౌచము.పిత్రాది సర్వ సపిండులకు 3 రోజుల జననాశౌచము.

ప్రసవము :- 7 వ నెల నుండి అందరు సపిండులకు 10 రోజుల జననాశౌచము.జననాశౌచమునకు అతిక్రాంతాశౌచము లేదు.

మృత శిశువు జన్మిస్తే :- 10 రోజుల జననాశౌచము. మృతాశౌచము లేదు.

బొడ్డు కోసే ముందు మరణిస్తే :- ఆడ లేదా మగ శిశువైనా తల్లికి 10 రోజుల జననాశౌచము. పిత్రాది సర్వ సపిండులకు 3 రోజుల జననాశౌచము.మృతాశౌచము లేదు.

బొడ్డు కోసిన తరువాత ఆడ లేదా మగ శిశువైనా 10 రోజులలో మరణిస్తే పిత్రాది సర్వ సపిండులకు 10 రోజుల జననాశౌచము.మృతాశౌచము లేదు.

పితృ గృహములో కూతురు ప్రసవించిన తల్లిదండ్రులకు 1 రోజు జననాశౌచము.

బాలింతరాలి శుద్ధి :-పుత్రుడు జన్మించిన ప్రసవమైన రోజునుండి 30 రోజులకు శుద్ధి. పుత్రిక జన్మించిన 40 రోజులకు శుద్ధి.

మృతాశౌచము

1.తల్లి / సవతి తల్లి లేదా తండ్రి మరణిస్తే:-ఉపనయనం లేదా వివాహం తో నిమిత్తం లేకుండా కొడుకుకి 10 రోజుల అశౌచము.అవివాహిత పుత్రికకి 10 రోజుల అశౌచము.వివాహిత పుత్రిక కి 3 రోజుల అశౌచము.దత్త పుత్రునకు కన్నతండ్రి అయినా పెంచుకున్న తండ్రి అయినా 3 రోజుల అశౌచము.అతిక్రాంతాశౌచము:-ఉపనయనం లేదా వివాహం తో నిమిత్తం లేకుండా కొడుకుకి 10 రోజుల అశౌచము. వివాహిత పుత్రికకి ఒకటిన్నర రోజుల అశౌచము.అవివాహిత పుత్రికకి స్నాన శుద్ధి.దత్త పుత్రునికి స్నాన శుద్ధి.

2.సపిండులు అంటే స్వంత లేదా అన్నదమ్ముల పిల్లలైనా (ముత్తాత,ముత్తవ్వ, తాత, ముత్త, పెదతండ్రి, పెదతండ్రి భార్య, పినతండ్రి,పినతండ్రి భార్య ) మరణిస్తే :- స్నాతకము లేదా వివాహము జరిగిన పురుషులకు10 రోజుల అశౌచము. ఉపనయనం కాని లేదా ఐన పురుషులకు స్నాన శుద్ధి.వివాహిత లేదా అవివాహిత స్త్రీలకు స్నాన శుద్ధి.

3.కొడుకు/ అన్న లేదా తమ్ముడి కొడుకు/ మనుమడు/ మునిమనమడు మరణిస్తే :- జన్మాదిగా 11 వ లేదా 12 వ రోజున మృతి చెందితే తల్లిదండ్రులకు మరియు సవతి తల్లికి 3 రోజుల అశౌచము. సపిండులకు స్నాన శుద్ధి.12 వ రోజు దాటి 6 నెలలలోపు మృతి చెందితే తల్లిదండ్రులు మరియు సవతితల్లికి 3 రోజుల అశౌచము మరియు సపిండులకు దహన పక్షం లో 1 రోజు అశౌచము. ఖనన పక్షం లో స్నాన శుద్ధి. 6 మాసముల నుండి 3 సంవత్సరాల మధ్య మృతి చెందితే తల్లిదండ్రులకు 3 రోజుల అశౌచము మరియు సపిండులకు 1 రోజు అశౌచము. 3 సంవత్సరాలు దాటి ఉపనయనం వరకు మధ్య మృతి చెందితే తల్లిదండ్రులు, సవతితల్లి మరియు సపిండులకు 3 రోజుల అశౌచము.ఉపనయనానంతరం మృతి చెందితే తల్లిదండ్రులకు, సవతితల్లికి మరియు సపిండులకు 10 రోజుల అశౌచము.అనుపనీతులకు, అవివాహిత మరియు వివాహిత స్త్రీలకు అశౌచము లేదు. అతిక్రాంతాశౌచము:- అనుపనీతుడైనా, ఉపనీతుడైనా, వివాహితుడైనా కొడుకు మృతి విషయంలో మాతాపిత్రులకు, సవతి తల్లికి మరియు సపిండులకు 3 రోజుల అశౌచము

4.కూతురు/ అన్న లేదా తమ్ముడి కూతురు/ మనమరాలు/ మునిమనమరాలు మరణిస్తే :- 10 రోజుల తరువాత మరియు 6 నెలల లోపు మరణిస్తే తల్లిదండ్రులకు, సవతితల్లికి 1 రోజు అశౌచము మరియు సపిండులకు స్నాన శుద్ధి. 7 వ నెలనుండి 3 సంవత్సరాల లోపు మృతి చెందితే తల్లిదండ్రులకు మరియు సవతితల్లికి 3 రోజుల అశౌచము. సపిండులకు స్నాన శుద్ధి. 3 సంవత్సరాలనుండి వివాహము పర్యంతము మృతి చెందితే తల్లిదండ్రులకు మరియు సవతి తల్లికి 3 రోజుల అశౌచము. సపిండులకు 1 రోజు అశౌచము. అనుపనీతులకు, అవివాహిత మరియు వివాహిత స్త్రీలకు అశౌచము లేదు. వివాహానంతరం మృతి చెందితే తల్లిదండ్రులకు మరియు సవతి తల్లికి 3 రోజుల అశౌచము. సపిండులకు 1 రోజు అశౌచము. అనుపనీతులకు, అవివాహిత మరియు వివాహిత స్త్రీలకు అశౌచము లేదు.

5.అన్న లేదా తమ్ముడు (పెద్ద తండ్రి లేదా పిన్న తండ్రి కొడుకులు కూడా) మరియు వారి భార్యలు మరణిస్తే :-అన్నదమ్ముల అశౌచము అన్నదమ్ములకు కొడుకుల అశౌచము వలెనే పై క్రమ సంఖ్య 3 లో తెలిపినట్లుగానే ఉంటుంది. అనుపనీతులైన అన్న తమ్ములు మరణిస్తే వివాహితలైన అక్కచెల్లెళ్ళకు (స్వంత, సవతి లేదా జ్ఞాతి-వరుస) అశౌచము లేదు. అక్కచెల్లెళ్ళ గృహంలో ఉపనీతుడు లేదా వివాహితుడైన అన్నదమ్ములు మరణిస్తే అక్కచెల్లెళ్ళకు 3 రోజుల అశౌచము. అన్య గృహంలో మరణిస్తే ఒకటిన్నర రోజుల అశౌచము. గ్రామాంతరంలో మృతి చెందితే 1 రోజు అశౌచము. అవివాహితలైన అక్కచెల్లెళ్ళకు అశౌచము లేదు.

6.అక్కచెల్లెళ్ళ మరణమందు:- వివాహితలైన అక్కచెల్లెళ్ళు స్వంత, సవతి లేదా జ్ఞాతి -వరుస

అన్నదమ్ముల గృహంలో మృతి చెందితే ఉపనీతులైన లేదా వివాహితులైన అన్నదమ్ములకు 3 రోజుల అశౌచము. అన్య గృహంలో మరణిస్తే ఒకటిన్నర రోజుల అశౌచము. గ్రామాంతరంలో మృతి చెందితే 1 రోజు అశౌచము. అనుపనీతులైన అన్నదమ్ములకు అశౌచము లేదు. వివాహిత సోదరి మరొక( స్వంత లేదా సవతి) వివాహిత సోదరి గృహంలో మృతి చెందితే ఆ సోదరికి 3 రోజుల అశౌచము.అన్య గృహంలో మృతి చెందితే ఒకటిన్నర రోజు అశౌచము. గ్రామాంతరంలో మృతి చెందితే 1 రోజు అశౌచము. వివాహిత సోదరి మరణిస్తే జ్ఞాతియైన సోదరికి అశౌచము లేదు.అవివాహిత సోదరి మరణిస్తే సోదరునికి (స్వంత, సవతి, జ్ఞాతి) కూతురు విషయంలో పై క్రమ సంఖ్య 4 లో సూచించినట్లుగానే అశౌచము పాటించాలి.అవివాహిత సోదరి మరణిస్తే వివాహిత /అవివాహిత సోదరికి (స్వంత, సవతి, జ్ఞాతి) అశౌచము లేదు.

7.భార్య / భర్త : భార్య మరణిస్తే భర్తకు 10 రోజుల అశౌచము, అలాగే భర్త మరణిస్తే భార్యకు 10 రోజుల అశౌచము. సవతికి కూడా 10 రోజుల అశౌచము. అతిక్రాంతాశౌచము కూడా పరస్పరము 10 రోజులు. సవతికి 10 రోజులు.

8.తల్లితండ్రి (మాతామహుడు) మరణిస్తే: వివాహితుడైన మనుమడికి లేదా వివాహితయైన మనుమరాలికి 3 రోజుల అశౌచము.గ్రామాంతర మృతియందు ఒకటిన్నర రోజు అశౌచము. ఉపనీతుడు, అనుపనీతుడైన మనుమడికి మరియు అవివాహితయైన మనుమరాలికి అశౌచము లేదు.

9.తల్లితల్లి (మాతామహి) మరణిస్తే:- వివాహితుడైన మనుమడికి వివాహితయైన మనుమరాలికి ఒకటిన్నర రోజుల అశౌచము. ఉపనీతుడు, అనుపనీతుడైన మనుమడికి మరియు అవివాహితయైన మనుమరాలికి అశౌచము లేదు.

10.కూతురి కొడుకు (దౌహిత్రుడు) మరణిస్తే:- ఉపనీతుడు లేదా వివాహితుడు ఐన మనుమడు మృతి చెందితే తల్లితల్లికి మరియు తల్లితండ్రికి 3 రోజుల అశౌచము, అనుపనీతుడైతే ఒకటిన్నర రోజుల అశౌచము.

11.కూతురి కూతురు మరణిస్తే:- మనుమరాలు మృతి చెందితే తల్లితల్లికి మరియు తల్లితండ్రికి అశౌచము లేదు.

12.అత్త లేదా మామ మరణిస్తే :- అల్లుడి ఇంటిలో గాని అల్లుడు దగ్గర ఉన్నప్పుడుగాని మృతి చెందితే అల్లుడికి 3 రోజుల అశౌచము, తమ స్వగృహంలో లేదా అన్య గృహంలో మృతి చెందితే ఒకటిన్నర రోజులు. గ్రామాంతరంలో మృతి చెందితే 1 రోజు, భార్య జీవించి లేక పోతే 1 రోజు అశౌచము.

13.అల్లుడు మరణిస్తే:- అత్తవారింట్లో గాని అత్తమామలు దగ్గర ఉన్నప్పుడుగాని అల్లుడు మరణిస్తే, అత్తమామలకు 3 రోజుల అశౌచము. అన్యత్ర మృతి కి స్నాన శుద్ధి.
14.బావమరిది (భార్య సోదరుడు) మరణిస్తే;- ఉపనీతుడు, వివాహితుడైన బావమరిది మృతి చెందితే బావకు 1 రోజు అశౌచము. బావమరిది అనుపనీతుడైనా, గ్రామాంతరంలో మృతి చెందినా, భార్య జీవించి లేకున్నా స్నాన శుద్ధి.
15.మరదలు (భార్య సోదరి) మరణిస్తే:- బావకు అశౌచము లేదు.
16.తల్లి సోదరి (పెదతల్లి, పినతల్లి) మరణిస్తే;- సోదరి కొడుకుకు వివాహిత కూతురుకు ఒకటిన్నర రోజులు, స్వగృహంలో మృతి చెందితే 3 రోజులు.
17.మేనత్త మరణిస్తే:- మేనల్లుడుకి, మేనకోడలుకి ఒకటిన్నర రోజులు (పక్షిణి), స్వగృహంలో మృతి చెందితే 3 రోజులు.
18.మేనమామ /మేనమామ భార్య మరణిస్తే:- స్నాతకం లేదా వివాహితుడైన మేనల్లుడికి మరియు వివాహితయైన మేనకోడలుకి ఒకటిన్నర రోజులు, స్వగృహంలో మృతి చెందితే 3 రోజులు.గ్రామాంతరంలో మృతి చెందినా, మేనమామ అనుపనీతుడైనా 1 రోజు. మేనమామ భార్య గ్రామాంతరంలో మృతి చెందితే 1 రోజు.
19.మేనల్లుడు మరణిస్తే:- మేనల్లుడు ఉపనీతుడైనా, వివాహితుడైనా మేనమామకు 3 రోజులు, 3 సం. వయసు పిదప మృతుడు అనుపనీతుడైనా అవివాహితుడైనా ఒకటిన్నర రోజులు.మేనత్తకు స్నాన శుద్ధి.
20.సోదరి కొడుకు మరణిస్తే:- తల్లి తోబుట్టువులకు 3 రోజులు, 3 సం. వయసు పిదప మృతుడు అనుపనీతుడైనా అవివాహితుడైనా ఒకటిన్నర రోజులు.
21.మేనకోడలు మరణిస్తే:- మేనమామకు స్నాన శుద్ధి.
22.సోదరి కూతురు మరణిస్తే :-తల్లి తోబుట్టువులకు స్నాన శుద్ధి.
23.మేనత్త కొడుకు/మేనమామ కొడుకు/తల్లి సోదరి కొడుకు మరణిస్తే:-పురుషులకు స్వగృహంలో మృతి చెందితే 3 రోజులు, అన్య గృహంలో మృతి చెందితే ఒకటిన్నర రోజులు మృతుడు అనుపనీతుడైతే 1 రోజు. స్త్రీలకు స్నాన శుద్ధి.
24.మేనత్త కూతురు/మేనమామ కూతురు/తల్లి సోదరి కూతురు మరణిస్తే:-మృతులు వివాహితులయితే 1 రోజు, అవివాహితులైతే స్నాన శుద్ధి.
25.దత్తుడి మరణ విషయంలో :- మృతుడు పరగోత్రోత్పన్నుడైన స్వ జననీ జనకులకు మరియు పాలక మాతాపితరులకు 3 రోజులు. పూర్వాపార సపిండులకు 1 రోజు. దత్తుడి పుత్రపౌత్రాదుల

జనన మరణ విషయంలో పూర్వాపార సపిండులకు 1 రోజు.

26.జనక మరియు పాలక సపిండులు మరణిస్తే:- పరగోత్రస్థ దత్తుడికి 1 రోజు.

27.గురువు మరణిస్తే:- మంత్రోపదేశం చేసిన గురువు మృతి చెందితే 3 రోజులు, గ్రామాంతరంలో ఒకటిన్నర రోజులు.

28.యతి మరణిస్తే:- సపిండులందరికీ స్నాన శుద్ధి.

29.సమానోదకులు (8 వ పురుషుని నుండి 14 వ పురుషుని వరకు) మరణిస్తే:- 3 రోజులు

30.సగోత్రులు (15 వ పురుషుని నుండి 21 వ పురుషుని వరకు) మరణిస్తే:- స్నాన శుద్ధి.